శ్రీ గురవే న

శ్రీర

# శ్రీ రంగనాయక శతకము.



గ్రంథకర్త:

పగడాల రంగప్ప.

ఉపాధ్యాయుడు, బసిరెడ్డిపల్లె.

(కడప జిల్లా.)



ప్రొద్దుటూరు:

శ్రీ కన్యకాపరమేశ్వరీ ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1935

వెల 0-2-0

శ్రీ గురవేనమః

శ్రీరస్తు.

# శ్రీ రంగనాయక శతకము.

ఉపాధ్యాయుడు, బసిరెడ్డిపల్లె.

(కడప జిల్లా.)

ప్రొద్దుటూరు:

శ్రీ కన్యకాపరమేశ్వరీ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

1935

వెల 0-2-0

శ్రీ బొగ్గుడుపల్లె నివాసులగు

# మ॥ రా॥ శ్రీ॥ దుగ్గసాని లక్ష్మిరెడ్డిగారు.

ఉ॥ చిన్నతనంబునుండి నను • జిక్కులఁబాపుచు జీవితంబుకై
పెన్నిధిగాఁగ నిల్చియును • బ్రేమను నెప్పుడు గీర్తిఁ గోరుచున్
ఉన్నతమార్గముల్ గనెడు • నూహాల నెన్నియొ నాకుఁదెల్పుచున్
నన్నిట నిల్పినట్టి ఘను • నామముఁ దెల్పెదఁ జిత్తగింపుఁడీ.

సీ॥ పెడకంటి కులములోఁ జేరొందు దుగసాని
వంశమందున బుట్టె వరఘనుండు
నామధేయంబిల నాగిరెడ్డి యనంగ
నాతని సతి యచ్చమాంబ కలదు
వారి గర్భంబున వఱలె జ్యేష్ఠ సుతుండు
నార్యులు మెచ్చఁ గా నవతరించె
శరధిలో నమృతంబు సమకూడి నట్లుగాఁ
గాపు వంశంబున ఘనత నొంచె

గీ॥ సుగుణ యశముల శ్రీరాము జోటియనగ
దైవ భక్తిని బ్రహ్లాదు దాల్మి ధరణి
దానమునఁ గర్ణుఁ దుల్యుడౌ ధాతయనఁగ
వెలసె శ్రీ లక్ష్మిరెడ్డి యన్విశద కీర్తి.

# విజ్ఞాపన.



చ॥ చదువఁగలేదు గ్రంథములఁ జయ్యన నేర్పున నెన్నియేనియున్
గుదురుగలేదు మానసము కొంచెపుదృష్టులయందుఁ బాఱుచున్
బదుగురలోన మెప్పులను భారతభూమిని బొందలేను నా
కొదువలు మన్ననంగొనరె కోటికమీఱఁ గవీంద్రు లెల్లరున్.

మహాశయులారా! నేను జిన్నతనంబునుండియును జగద్రక్షక భక్త సంధాయకుని యనుగ్రహంబువలనఁ బ్రప్రథమమున గొన్ని కొన్ని క్రొత్తవర్ణనలచే భగవంతుని స్తోత్ర పాత్ర కీర్తనలు చేయుచుండియు మనమున భక్తిరస శోకిక సాంఘికాది పూరితంబులగు కొన్ని పద్యంబులు రచింప నుత్సాహంబు మనంబున నుండు కతంబున గొంత కాలంబునకుఁ బుణ్యాత్ములచే రచితంబులగు గ్రంథ పఠనంబు వలనను బరమేశ్వరుని కరుణా కటాక్షంబు వలనను నీచిన్ని పొత్తంబు రచించితి. ప్రారంభమిది యగుటచె నిందుగల యతి గణ ప్రాస వ్యాకరణాది దోషంబుల నివర్తింపఁ గారణం బౌరయుచుండఁ బులివెందుల గ్రామ నివాసియు ననేక గ్రంథకర్తయు న్యాయవాదిపద విభూషితుఁడునగు మ॥ రా॥ శ్రీ॥ యల్. వెంకటరమణయ్యగారు నామనంబునంగల శంకంబాపి శతకోత్సాహమునకుం నన్నుఁ బురికొలిపి యనేక కష్టములకోర్చి యిందలి లోపముల సరిదిద్ది నన్ను ఆనందింప జేసినందులకు వారికి నేనెంతయుఁ గృతజ్ఞతాభివందనంబులు. సర్వేశ్వరుఁడు వారి కుటుంబము నెంతయు నెల్లప్పుడు రక్షించుఁ గాత!

బసిరెడ్డిపల్లె,
బోర్డుస్కూల్ టీచర్.

ఇట్లు సుజనవిధేయుడు,
గ్రంథకర్త, పి. రంగప్ప.

# పండితాభిప్రాయము.



ఇయ్యది కడపజిల్లా పులివెందుల తాలూకా బసిరెడ్డిపల్లె గ్రామనివాసి యగు శ్రీయుత పి. రంగప్పగారిచే రచియింపఁబడినది. ఈశతకము నామూలాగ్రముగ దిలకించి కొన్ని లోపములసవరించితిని. ఇది జనసామాన్యమున కుపయుక్తమైన సాధారణ శైలిని లిఖింపబడినది. ఈశతకరాజము భక్తిరసప్రపూరితమై యింపులొలుకు పలుకులచే వెన్నలరుచున్నది. ఆర్తజనరక్షణ పరాయణుండగు భగవంతునిలీలావిశేషములు విశేషముగ వర్ణింపబడి పండిత పామరజనంబుల హృదయారవిందంబులకు సంతసంబొందఁజేయుననుట కెద్దియు సందియంబు లేదు. మానవులు దీనిబఠించిన నిహమందు భక్తివైరాగ్యములును బరమందు సౌఖ్య సంపద లొదవుననుట కెట్టి సందియము గన్పట్టదు. ఈకవి యీశతకంబు రచించుట ప్రథమ ప్రయత్నము ఇవ్విధమున నీకవి పట్టువదలక ప్రయత్నించిన కవితాపీఠమందగ్రస్థానము నలంకరింపగలడని నాయభిప్రాయము. శ్రీమన్నారాయణ కరుణా కటాక్షముచే నీకవికి జిరాయువు గలిగి యిట్టి పెక్కు గ్రంథరాజముల రచించి జనాభిమానమును దేశాభిమానమును పండితాభిమానమును బడసి శాశ్వత కీర్తి గడించు గాత.

పులివెందుల,
**23–5–1931.**



ఇట్లు బుధజన విధేయుడు,
యల్. వెంకట్రమణయ్య.

శ్రీగురవేనమః

# శ్రీ రంగనాయక శతకము.



ఉ॥ శ్రీధవ భూధవా సుజన ♦ సేవిత భక్తజనాళి రక్షకా
వేదవినోద మౌనినుత ♦ విశ్రుత యచ్యుత యద్వితీయమో
సాధుజనాళి పోషగుణ ♦ సన్నుత శాత్రవ కంఠలుంఠనా
మోదముతోడఁ గావుమని ♦ మ్రొక్కెము నీమది రంగనాయకా.

ఉ॥ మ్రొక్కెద వ్యాసమౌనికిని ♦ మోదముమీఱ శుకున్ భజించెదన్
అక్కఱతోడఁ గొల్చెదను ♦ నాకవి పోతన నన్నయాదులన్
దిక్కన భట్టు మూర్తులను ♦ దివ్య కవీశ్వరు కాళిదాసునిన్
దక్కిన పెక్కు సత్కవుల ♦ దద్దయు నెంచెద రంగనాయకా.

ఉ॥ కొల్లగ గద్య పద్యములఁ ♦ గోటు లనేకము లల్లువారినిన్
బొల్లుల నేర్పునన్ వెదకఁ ♦ బొల్చు నొకా నొకచోట నట్లనన్
జెల్లని చంద్రు నంతటను ♦ జొల్లఁగ శ్వేతపు గాంతు లొల్కెనన్
నల్లని కందు మధ్యమున ♦ నంటదె యెప్పుడు రంగనాయకా.

చ॥ పువ్వులను జేరి కీటకము ♦ పూజ్యత నొందిన యట్టిరీతినా
భవ్యున కజేయుఁడౌ హరిని ♦ బ్రార్థనఁ జేసిన పద్య రాశిలో
నవ్వులుగ గొన్ని లోపములు ♦ నంతటఁ గల్గిన నార్యు లెల్లరున్
జీవులకు ముఖ్యపాత్రమని ♦ చాటరె యీభువిరంగనాయకా.

ఉ॥ కొన్ని పురాణముల్చనుపు ♦ కొన్నను మాద్యృశులల్లు కావ్యమం-
దెన్నికమీఱు లోపముల ♦ నించుక కాంతి వహింపదంద్రు నీ
చిన్నదియైన పాత్త్రమున ♦ జిన్మయు పాదముల్ఁ సతంబు హృ
త్సన్నిధి యందు నిల్పి పెన ♦ సన్నుతిఁజేసెద రంగనాయకా.

ఉ॥ దేవ పరాత్పరా విమల ♦ దేహ జనార్దన విశ్వరూప యో
భావజు తండ్రి దివ్యగుణ ♦ భాసురహాని గణాదివంద్య యో
శ్రీవనితా మనోహర య ♦ శేష గుణాకర పాపనాశ నీ
సేవకుఁ బూన్పుమంచు హరి ♦ సేవగొనర్పుము రంగనాయకా.

ఉ॥ మాయలఁబీడఁ జేయఁగల ♦ మానసమిచ్చియు దీర్ఘ కాలముఁ
శ్రీయుఁజిరాయువుఁ యశము ♦ శ్రీహరి సంస్మరణంబు నుర్విలో
గాయము పొందు పూర్వభవ ♦ కర్మములెల్లను గొట్టివేయుచుఁ
నాయమబాధఁబాపుమని ♦ నాథుని మ్రొక్కుము రంగనాయకా.

ఉ॥ మానుగ జీవరాసులను ♦ మానవ జన్మమె యెక్కువౌఁగదా
హీనలకంటెఁ బూరుషులె ♦ సర్వవిధంబుల శ్రేష్ఠులౌదు రా
మానవులందు నుత్తములు ♦ మంచి వివేకులు వారిపైననా
గాన వినోదు భక్తులన ♦ ఘు ప్రవరుల్గన రంగనాయకా.

ఉ॥ ఎవ్వని యాజ్ఞ శీర్షముల ♦ నెల్ల సురాసురు లుంచియుందురో
యెవ్వని దీన సేవ్యుడని ♦ యెల్ల జనంబులు సన్నుతింతురో
యెవ్వని వీక్షచే జగము ♦ లెల్ల జనించెనో యట్టి దేవుని
న్నెవ్వపుఁ గాలమందెమది ♦ నమ్మి భజింపుము రంగనాయకా.

ఉ॥ ఆపద లొందువేళ మఱి ♦ యచ్చపుఁ జీఁకటిఁబోవు వేళలన్
నోపఁగ జాలనట్టితఱి ♦ నోజను వర్షము రాని వేళలన్
బ్రాపగు రోగ బాధలను ♦ బాయని యట్టి యుపద్రవంబులన్
దా పరమాత్ము వేఁడుటది ♦ యంచిత భక్తియె రంగనాయకా.

ఉ॥ ఎన్నఁడుఁ దన్ను గానకయె ♦ యొనరును డించి పాపమొందితాఁ
గన్న కుమారునిన్ మరణ ♦ కాలమునన్ హరి పేరఁ బిల్వఁగా
నున్న యఘంబుఁ బాసె నన ♦ నోపిక దేవుని వేఁడ వారిదా
పున్నము నెట్టు లెంచెనగు ♦ బూని కనుంగొన రంగనాయకా.

ఉ॥ ఆర్తజనావనా యనుచు ♦ నా యసురార్భకుఁ డిద్ధభక్తిసం
కీర్తనఁజేయఁ గంబమున ♦ గీర్తి వెలుంగఁగఁ బుట్టినాఁడునా
యార్తిదొలంగ ద్రౌపదికి ♦ నక్షయ వస్త్రములిచ్చెఁ జూడనా
కర్తను నీవు వేఁడుమిఁకఁ ♦ గామిత సిద్ధికి రంగనాయకా.

ఉ॥ సాధు జనావనుం డనుచుఁ ♦ జెక్కని కీర్తి వహించి నేడునా
బీద కుచేల భక్తునకుఁ ♦ బ్రేమను భాగ్యములిచ్చి బ్రోచియా
మోదమునందు దివ్యమగు ♦ మోక్ష మొసంగిన కృష్ణదేవు స
త్పాదము వీడకుండుమదె ♦ బ్రహ్మ పదంబిక రంగనాయకా.

ఉ॥ కొంచెపుఁ జీమలందునను ♦ గొప్ప కరీంద్రము నందుఁ గోటికిన్
మించిన భాగ్యవంతులను ♦ మిక్కిలి బీదలయందు దోషులన్
ఎంచఁగఁ జిన్నదోమలను ♦ నెద్దుల గ్రద్దలఁ బెద్ద పక్షులన్
వంచనలేక నాహరియె ♦ వాఛకయుండును రంగనాయకా.

ఉ॥ ఎంచఁగఁ సర్వసృష్టికిని ♦ నేలికయై మఱి యెన్ని రూపులన్
మించి జగంబు నిండియును ♦ మీఁదునఁ గ్రిందున నెల్లదిక్కులన్
ఎంచిన భక్తవర్గముల ♦ కేమి కొఱంతలు గల్గఁజేయకే
పెంచుచునుండు జీవులను ♦ బ్రేమను దేవుఁడు రంగనాయకా.

ఉ॥ కొండల మంద నేలనిఁకఁ ♦ గోర్కె లొసంగెడి కామధేనువై
తొందఱఁజేయునట్టి పెను ♦ దోషము గూల్చెడి ప్రాణదాతయై
యొందు జరించినన్ మఱియు ♦ నేమఱకుండని మిత్రవర్యుఁడౌ
నంద సునందనుం గనిన ♦ నాకము చేకుఱు రంగనాయకా.

ఉ। సాధులు వాదులుం మునులు ♦ సాగరపర్వత చంద్రసూర్యులున్
ఈధర జంతుజాలములు ♦ నీశుఁడు ధాత సురేంద్ర ముఖ్యులున్
బీదలు భాగ్యవంతులును ♦ భీరులు శూరులుఁ జోరులందఱున్
శ్రీధరు సృష్టియే యనుచుఁ ♦ జిత్తమునంగను రంగనాయకా.

ఉ॥ దాన తపో వ్రతంబులను ♦ దాపస వృత్తుల నెల్ల నిష్ఠలన్
మానము యజ్ఞముల్ శ్రుతుల ♦ మంచియశంబున శక్తిపూజలన్
గానఁగఁ దీర్ఘ సేవలను ♦ గాంచి యుపాసన లెన్ని జేసినన్
మానస భక్తితో సమము ♦ మాధవు డెంచడు రంగనాయకా.

ఉ। చాలుగ ఘోర పాపముల ♦ సారెకు సారెకుఁ జేయుగొప్ప దు
ష్కాలపుఁ గాపురంబునను ♦ గూడెడి షడ్గుణ మాపఁజాలకే
తూలుచుదుఃఖముల్ పడుచు ♦ దూరములయ్యెనుబుణ్యమార్గముల్
గాలుని బాధలంగడపఁ ♦ గాంచుట యెన్నఁడు రంగనాయకా.

ఉ॥ మంచి గుణంపు సంగతిని ♦ పరాన్య గుణంబులు ద్రోచివైచిసం
ధించును సద్గుణంబనెడి ♦ నీఘననామము సత్యమే యగున్
గొంచెము పున్గుపెట్టెనిడ ♦ గొప్ప సువాసన నన్ని వస్త్రముల్
గాంచిన రీతి సజ్జనుల ♦ గాంచుచు నుండగ రంగనాయకా.

ఉ॥ సజ్జన గోష్ఠియే మొదటి ♦ స్వర్గపు మెట్టని యెంచుచుందువా
రిజ్జగమందు సాధువులు ♦ నెంతయు సాధన మెంచిచూడనా
యొజ్జలఁజేరి దైవగతి ♦ నొంటఁ గనుంగొని మానసంబునం
దజ్జగధీశునింగనుట ♦ యంచిత మార్గము రంగనాయకా.

ఉ॥ నిద్దుర నుండు కాలమున ♦ నిచ్చలు శూన్యము దోఁచు కైవడిన్
బెద్దగు మేడలుం గరులు ♦ బెక్కు ధనాదులు చిక్కినట్లునై
కొద్దిగ మేల్కొనంగ నవి ♦ కొన్నిటి నైనను జూడనట్లుగన్
దద్దయు సిద్ధి జెందవిక ♦ శ్రీహరి వేఁడుము రంగనాయకా.

ఉ॥ పన్నుగఁ బుణ్య పాపముల ♦ బల్మఱుఁజేయుచు మోహభ్రాంతిచే
గన్నులఁ గానకే దురిత ♦ కర్మములోఁబడి కుందు వారికిం
కెన్నిట నేనియుంగలుగు ♦ నేపరమాత్ముని గొల్వఁ జాల క
త్యున్నత మోక్షమార్గమెటు ♦ లున్నదె భూమిని రంగనాయకా.

ఉ॥ ఇట్టటు పోవు గోగణము ♦ లీవల నావల బోవనీక యా
గట్టి తలుంగునన్ మెడకుఁ ♦ గట్టియు నిల్పిన తీరుగా నిన్నున్
నెట్టన ద్రిప్పు మానసము ♦ నిచ్చలుఁ గట్టుము దైవభక్తియన్
దిట్టపుఁ ద్రాటిచే గుణము ♦ తీవ్రత మానఁగ రంగనాయకా.

ఉ॥ కొందఱు దుష్టవృత్తినిల ♦ గోముఖమౌ బులి వర్తనంబులన్
మందిర పుత్ర ముఖ్యులను ♦ మానియు సజ్జన వేషమూనిబల్
విందగునట్టి వాక్యముల ♦ వీరిని వారిని మోసగింతురా
చందము నొందఁబోక హరిఁ ♦ జెక్కఁగఁగొల్వుము రంగనాయకా.

చ॥ దేవుని జూడ యాత్రలను ♦ దేఱకు నెప్పుడు దిర్గుచుండఁగా
భావనమౌనె యాత్మ ఘన ♦ పామర సంఘములందు నంతటన్
భావము నందునంగలుగు ♦ పాతకముల్ వడిద్రోసివైచి యా
జీవుఁడు దేవుఁడే యనఁగఁ ♦ జిక్కఁడె మోక్షము రంగనాయకా.

ఉ॥ కోపము దైవనిష్ఠలను ♦ గూల్చెడి తాపము సత్ప్రవర్తనన్
బాపెడి కూపముల్ సుజన ♦ వర్గ విదూరము పాపవృద్ధిసం
తాపము దూరదృష్టిగన ♦ దూరముఁ జేయుచు శత్రువర్గముల్
జూపు నటంచు నీమదిని ♦ జూచి కనుంగొను రంగనాయకా.

ఉ॥ మాయలఁ గార్య సాధనను ♦ మానక ధాత్రిని సంచరించితా
దోయజ సంభవాదులకుఁ ♦ దోఁచక యుండియు భక్తవర్గముల్
బాయక కాంచుచున్ రిపుల ♦ భస్మము జేసెడి దైవ ముండగన్
నీయఘ పంక్తులంగనుచు ♦ నీవెఱపేటికి రంగనాయకా.

ఉ॥ ఆరయ నన్ని జాతులను ♦ నంత మెఱుంగక యార్యు లందఱున్
ఏరికి దోఁచు మార్గముల ♦ నెన్నదు వేవిధులందలంచి యా
తీరుల నన్నిటిన్ విడిచి ♦ తీవ్రపు భక్తిని నెల్ల వేళలన్
నారద మౌని సన్నుతుని ♦ నారసి వేడుము రంగనాయకా.

ఉ॥ ఆవుల మందలంజేసియు ♦ నంతట క్షీరపుఁ గుంభముంచి యే
తావున పాలు పిండినను ♦ దానిని గాంచి చరించు రీతిగా
నేవిధి నీవు చూచినను ♦ నెందులకేగిన మానసంబు నా
దేవునిఁ జూచుచుండుఁమిక ♦ దెల్వని నెప్పుడు రంగనాయకా.

ఉ॥ దేవుఁడు సర్వ జీవులను ♦ దేహములందు వసించు నెట్టు లా
భావము పుట్టనేల జల ♦ భాండములన్నిటఁ జంద్ర సూర్యులున్
గేవల రూపజాలములఁ ♦ గన్నులఁ దోఁచెడు రీతి నంతటన్
దావిలసిల్లు దైవమని ♦ తద్దయు నమ్ముము రంగనాయకా.

ఉ॥ కర్మముచేత జన్మములు ♦ గల్గుచునుండియుఁ బిన్న పెద్దలున్
గర్మముచేతఁ బొందుదురు ♦ కష్ట సుఖంబుల నెంచిచూడఁగా
గర్మలు వీడిపోయినను ♦ గల్గవు నీకటుమీఁద జన్మముల్
నిర్మల బుద్ధితో హరిని ♦ నిల్పుము నీమది రంగనాయకా.

ఉ॥ దేవుని వేఁడువారిదెస ♦ దేరికనుంగొన వేయకాలమున్
జావులు నంతకుండయినఁ ♦ జంపగ జీవుని భీతి జెందునన్
భావము దెల్పె శాస్త్రములు ♦ భావమునందున నెల్లవేళ లే
త్రోవలు మాని సంతతము ♦ దేవుని వేఁడుము రంగనాయకా.

ఉ॥ ఈయిల బాధలంగడప ♦ నింతటి గష్టములయ్యెఁ జూడఁగన్
నాయమబాధ ముందునిది ♦ హస్తికి నీఁగకుఁ బోల్చురీతియాఁ
గాయము పాయు నాఁటికిని ♦ గాలుని బాధలఁ జిక్కకుండఁగాఁ
జేయు ముపాయమా హరిని ♦ జెంది సుఖించుటె రంగనాయకా.

ఉ॥ జాతుల నెంచనేల నిజ ♦ శక్తిని గానక దుష్టవృత్తిచే
నీతులు మాని దైవమును ♦ నిందల జేసెడి నీచులైన నే
జాతికి వారు హీనులని ♦ చెప్పఁగ వచ్చును గాని నేఁడు నా
ధాతల తాతనుంగనెడి ♦ ధన్యులు శ్రేష్ఠులు రంగనాయకా.

ఉ॥ ప్రాపుగ నిర్వికారుఁడగు ♦ బ్రహ్మము గన్గొనఁ బాపి మాయ తో
నోపఁగఁ బాయుచుండునని ♦ నొక్కి విశేషము చెప్పనేల యా
కూప తటాక నీరములు ♦ గ్రుంకవె భాస్కర వహ్ని చేత నీ
పాపము లట్లెవీడు హరి ♦ పాదరజంబున రంగనాయకా.

ఉ॥ తల్ప ననేక పూసలొక ♦ దారము నందున నిల్చునట్లుగా
నల్పము గొప్ప జీవులను ♦ నాపరమాత్ముఁడు నిండియుండి దా
గల్పములందునొక్కఁడుగఁ ♦ గాంచుచునుండునుగాని యెంతయున్
శిల్పిని బోలి యిజ్జగము ♦ సృష్టిని జేయును రంగనాయకా.

ఉ॥ కోరిన మద్రుచుల్ దినుచు ♦ గొంటెతనంబున వారి వీరినిన్
గోరుచుఁ గన్నుగానకయె ♦ గొప్పగు పాపముఁ జేయుచుండఁగా
దూరములయ్యె పుణ్యములు ♦ దుష్టుఁడవైతివి నీవదెప్పుడో
శ్రీరమణీ మనోహరుని ♦ జింతలఁ జేయుట రంగనాయకా.

ఉ॥ రూపము వంశమున్ ధనము ♦ రూఢి వెలింగెడి విద్యలెల్లనున్
బ్రాపగు యౌవనంబు నిల ♦ పందలు మర్త్యులకెల్ల గర్వమున్
జూపును సజ్జనాళికవె ♦ చుల్కనఁగాఁ గనుపట్టు చూడఁగన్
ఏపద మబ్బినన్ హరిని ♦ నేమఱకుండుము రంగనాయకా.

ఉ॥ ఇల్లును వాఁకిలిన్ విడిచి ♦ యీదఁగఁజోలని దుర్వ్రమోహమున్
ద్రెళ్లక యేమి మోక్షమిఁక ♦ దేహము నున్న దినంబు లందులోఁ
గల్లగుఁ గుక్షి పోషణకు ♦ గాంతల బిడ్డల చేతనుండినన్
ఉల్లమునందు శ్రీహరిని ♦ గొల్చుట మోక్షము రంగనాయకా.

ఉ॥ తాతలుఁ దల్లిదండ్రులిక ♦ దాతలు నేతలు నెందటెందఱో
భూతలమందుఁ గూలుచును ♦ భూమి ధనాదులతోడఁ బోయిరే
యీతనువందు నెవ్వరికి ♦ నీశుఁడు భుక్తికినీక చంపె నీ
గాతికి దుష్ట కృత్యములు ♦ గాంచఁగ నేటికి రంగనాయకా.

ఉ॥ మాయలఁజిక్కి నీదయిన ♦ మంచిగుణంబులఁ బాడుచేయుచున్
ద్రోయఁగరాని కష్టముల ♦ ద్రోయగ జూచుచు సర్వకర్మలన్
జేయఁగఁ బ్రోత్సహించు నిజ ♦ చింతనఁ గల్గియు నీవునెందు నా
మాయల నర్తకున్ మదిని ♦ మానక యెంచుము రంగనాయకా.

ఉ॥ వేసము చూచి భక్తులని ♦ వెఱ్ఱితనంబున నమ్మఁబోకు బల్
మోసముజేయుచుందురిఁక ♦ మొప్పెలుకొందఱు భూమిలోపలన్
వేసము మోసమున్ విడిచి ♦ వీక బరాత్మను గాంచు భక్తులన్
ఆసను జేరి మెప్పు హరి ♦ నారయు చుండుము రంగనాయకా.

ఉ॥ కంటివనేక భోగములు ♦ గాంచెను నాయువు కొంతచూడగా
వింటివనేక శాస్త్రములు ♦ విహ్వల భంగిని నెల్ల చోటులన్
గంటివిగాని మాయలను ♦ గాంచియు గాననివానిభంగి నీ
కొంటెతనంబుచేఁ జెడుట ♦ గొప్ప విపత్తగు రంగనాయకా.

ఉ॥ కాయము శీర్ణమై శిరము ♦ కంపితమై తెలుపెక్కె కేశముల్
ప్రాయము గోలుపోయి తగఁ ♦ బండ్ల పటుత్వము తప్పిపోయినన్
బాయఁగఁజోల వాశలికఁ ♦ బ్రాణములుండిన యంతకాలమున్
మాయల యాశవీడహరి ♦ మానని భక్తియె రంగనాయకా.

ఉ॥ దాపురమౌను గష్టములు ♦ తద్దయు దేహము గాసిపెట్టునన్
కోపముఁ జూపెదేల మును ♦ గొప్ప యఘంబును నేమిచేసితో
తోఁపదుగాని యింకెటను ♦ దోసముగూర్చెడి సేఁతమాని యా
శ్రీపరమాత్మునిన్ మదిని ♦ జేర్చి భజింపుము రంగనాయకా.

ఉ॥ నాగసరంబు నాదముల ♦ నాగములే విననేర్చుఁ గాని వే
బాగుగఁ జూచినంత పెఱ ♦ పాములు దాని వినంగఁజాలునే
యాగతి చూడ నీజగతి ♦ నంనఱు మానవు లీశుభక్తిబల్
బాగని చెప్పఁబోరు నిజ ♦ భక్తులు దక్కఁగ రంగనాయకా.

ఉ॥ ఎవ్వరుగాని చిత్తమున ♦ నేమరకెప్పుడు దైవభక్తినిన్
నివ్వటిలంగఁజేయ హరి ♦ నిచ్చలుమెచ్చు నదెట్టులన్న మున్
దవ్వుల నున్న దంతిమొఱ ♦ దావిని యెంతయు శ్రద్ధ దావడే
రివ్వున గ్రాహముం దునిమి ♦ ప్రీతిని శ్రీహరి రంగనాయకా.

ఉ॥ మాయల మంటిబొమ్మ మఱి ♦ మానని రోగపుఁ దోలుతిత్తి యీ
కాయము నమ్మఁగాఁజేనను ♦ కాలుని దూతలపాలి సొమ్ముగాఁ
జేయకటంచు నాహరికిఁ ♦ జేతులు మోడ్చియు నుల్లమందునన్
బాయని భక్తిఁ గొల్వ మది ♦ భద్రపు రక్షణరంగనాయకా.

ఉ॥ ఏటికి మోహముంచెద వ ♦ దెందుకు నెక్కనిదేహ మంచు నీ
పాటికి నీవు చూడఁ బసి ♦ బాలురుఁ బ్రౌఢులు వృద్ధులెల్లరా
కాటికిఁ బోవుచుండఁ గని ♦ కానని వాని విధంబునన్ మదిన్
నాటిగ దృష్టినిల్పి హరి ♦ జొప్పడఁ గొల్వవు రంగనాయకా.

ఉ॥ బూటకమైన యీతనువు ♦ పూర్ణముగా మదినమ్మి నీవు నా
బోటులచూపు రూపుగని ♦ పొంగుచుఁగాలము వ్యర్థపుచ్చుటల్
ఏటిని దాఁటగాఁ దలచి ♦ యెద్దని దున్నను జేరినట్లగున్
గోటిరవి ప్రకాశు హరి ♦ గోరి భజింపుము రంగనాయకా.

ఉ॥ దేహ మనిత్యమౌ ముటికి ♦ దేలెటి రోగపు మూలమౌను నా
ద్రోహపుఁ జింతలం మదిని ♦ ద్రోయగఁ జేసెడి పాడుకొంప కీ
మోహము మేరగాదు హరి ♦ మోదముతోడుత వేఁడుచుండు నీ
ద్రోహము లన్నియుంగడపి ♦ దొడ్డ పదంబిడు రంగనాయకా.

ఉ॥ అంతమునందు రోగమున ♦ నంతము బాధలఁ ద్రెళ్లఁజేసి నీ
మంతన మంతయుం జెడియు ♦ మార్గముగానక యుండఁజేయుశ్రీ
కాంతుని పాద పంకజము ♦ గన్గొని మ్రొక్కుము నేటికిప్పుడే
చెంతను జేర్చి బ్రోవు నిను ♦ జేకురు సౌఖ్యము రంగనాయకా.

ఉ॥ సంకట జాలమందుఁ బడి ♦ సంగమ మంతయు మానలేక దు
స్సంగతులందు జీవితము ♦ చేయ్యనఁ జేయుచు దైవప్రార్థనా
సంగతిగానకే భువిని ♦ జచ్చిన నెవ్వఁడు నీకు దిక్కకే
సంగతి బుద్ధినిల్పి హరి ♦ సన్నుతి జేయుము రంగనాయకా.

ఉ॥ రాముఁడు రక్షకుండు రఘు ♦ రాముఁడు పాయని నేస్తకాడు శ్రీ
రాముఁడె బాంధవుండు శుభ ♦ రాముఁడు మాయిలువేల్పు జానకీ
రాముఁడు మాకు దిక్కనుచు ♦ రాత్రులహంబులు బాయకుండు మీ
భూమిని సాటిలేని ఘన ♦ పూజ్యుఁడ వౌదువు రంగనాయకా.

ఉ॥ కావడికుండలట్లుగద ♦ కష్టసుఖంబులుఁ గల్మి లేములున్
భావనఁ జేసి చూడగను ♦ భాసిలు వెన్నెల మబ్బు లట్లుగా
భావజునాజ్ఞ మానిసికిఁ ♦ బ్రాప్తమురీతి విధించు నండ్రు నీ
భావమునందు నన్నెఱిఁగి ♦ భక్తిని వీడకు రంగనాయకా.

ఉ॥ మానవ నిర్మితంబులగు ♦ మంచి ప్రకాశము లీను దీపముల్
పూనిక చంద్రుచేఁ గలుగు ♦ పున్నమ కాంతిని మించ వెంతయున్
మానవు చర్య లేవయిన ♦ మానిసి కర్మపు జన్మ వీడు నా
దీనుల పెన్నిధానమగు ♦ దేవుని గొల్వుము రంగనాయకా.

ఉ॥ సంతస మిచ్చునట్టివగు ♦ సంపదలన్నియుఁ గల్లలంచు దా
నింతట నంతటన్ దెలిసె ♦ నిప్పటికైనను మానసంబు నా
సంతత వైభవోన్నతుని ♦ సద్గురు పాదములందుఁ జేర్చి నీ
చింతల నన్నిటన్ విడుము ♦ శీఘ్రముగా మది రంగనాయకా.

ఉ॥ సాగర మధ్యభూమిగల ♦ సర్వజనాళిని రక్షఁ జేయుచున్
భాగవతార్థ భక్తిగను ♦ భక్తవతంసుల మేలుగాంచుచున్
యోగుల సాధులం బరమ ♦ యోధ చరాచర జంతుజాలమున్
బాగుగఁ బెంచు శ్రీహరిని ♦ భక్తిని వేఁడుము రంగనాయకా.

చ॥ దినములు మృత్యుకాలమున ♦ దీర్చుచుఁ గుక్షి కొరంతకోసమై
యనయము వేదనంబడుచు ♦ నన్ని యపద్ధము లాడుచుండి యీ
తనువులు గోలుపోయియును ♦ దాపముఁ బాపము నొందనేల నీ
మనమున దైవ సన్నుతిని ♦ మానక జేయుము రంగనాయకా.

ఉ॥ సర్వమయుండు దైవమును ♦ సన్నుతిచేయఁగ నెవ్వఁడోపు నీ
యుర్వి జనించు జీవులను ♦ నోపికగాంచుచు స్థూల సూక్ష్మముల్
పర్వున నంత రూపమును ♦ బ్రహ్మ మహేశ పురంద రాదులున్
సర్వముఁ జూడఁ జాలరఁట ♦ చాలగ మాయల రంగనాయకా.

చ॥ సతముసుతాది భ్రాంతినఘ ♦ సంగమునంబడి యీఁదుచుండి బల్
•సతమని నమ్మకెప్పుడును ♦ సత్యము కాయము నిల్వదెప్పు డీ
మతి తనువందు నుండగనె ♦ మానసమందున దేవుగొల్చి నీ
గతులకుమార్గముల్ గనుము ♦ కావరమూడ్చుము రంగనాయకా.

ఉ॥ పూర్వపు జన్మమందుఁ దగు ♦ పుణ్యముఁ జేయక పోయినందుకే
యుర్విని నిట్టి కష్టముల ♦ కోర్వని దేహము ప్రాప్తమాచు నీ
సర్వము జీవకోటులను ♦ జెచ్చుచుఁ పుట్టుచు నుంటివౌర నీ
సర్వము వీడు దేవుగని ♦ సౌఖ్యము నొందుము రంగనాయకా.

చ॥ పురుషులఁ బాప పుంజముల ♦ పూర్ణముఁ జేయగ బ్రహ్మదేవుఁడే
తరుణుల వాలుచూపుగొని ♦ తప్పక కామసుఖాఖ్య వాగురన్
మరుఁడను బోయవానిమగ ♦ మానిసి పిట్టలఁ బట్టజేసె నీ
వరుసను జన్మసత్ఫలత ♦ వాంఛను నుంచుము రంగనాయకా.

ఉ॥ సారములేని సంకటము ♦ సంచితమందు నె కూడినచ్చి నీ
చారుచిరాయు రోన్నతుల ♦ జర్పగఁ జూచును నప్పుడప్పుడే
యూరయ వానికన్నిటికి ♦ నౌషధ సేవమె రామనామముల్
జేరిసుఖంపు మాపదలు ♦ చెందవు నీకిఁక రంగనాయకా.

చ॥ మదవతి గబ్బిగుబ్బలను ♦ మానక గాంచియు మోహమంద కే
రుధిరముఁ గ్రొవ్వు మాంసమని ♦ రూఢిగఁ జూచినయప్పుడప్పుడే
మదిని దలంచు చున్నపుడె ♦ మాధవు చిత్కళగా నెఱుంగుచుం
గుదురుగ నీదుమానసము ♦ గూర్పుము నిత్యము రంగనాయకా.

ఉ॥ ఏటికి నింతయాతుర మిఁక ♦ కేశుని వేఁడగఁ గాలముండదే
పాటిలు బాల్యముల్ వరుసఁ ♦ బాసిన పిమ్మట దైవభక్తి దా
సూటిగ గాంచె వచ్చునని ♦ జూచెద వేటికి వృద్ధులుండఁగా
నాటల బాలురుల్ మడియ ♦ నాదట జూడవె రంగనాయకా.

చ॥ భువిని జనించు ప్రాణతతి ♦ బుద్బుద రూపము నిశ్చయంబుగా
కవి సతతంబటంచు మది ♦ గాఢపు మోహమునందు నుండి నీ
చెవిని రమా మనోహరుని ♦ జేర్చెడి గానము సోకకుండు నీ
యవినయ బుద్ధి కేమిగతి ♦ యానెకొ యీభువి రంగనాయకా.

ఉ॥ జీవుల నన్నిటన్ సమము ♦ చెచ్చెరఁ జూచుచుఁ గల్ల పల్కకే
భావమునం జనించు గదు ♦ బామర బుద్ధిని ద్రోసివైచి నీ
కావరమాది శత్రువులఁ ♦ గ్రక్కునఁ ద్రోసియు మానసంబునన్
దేవుని పాదముల్ గొలిచి ♦ తెల్వివి నుండుము రంగనాయకా.

ఉ॥ చూడఁగ నీవె యెల్లపుడుఁ ♦ జూచి భ్రమించెడి యిష్టభోగముల్
గూడుచు నుండియుండ్ మనసు ♦ గొంచెమునైనను ద్రిప్పలేకబల్
మూఢపు బుద్ధిచే నెపుడు ♦ ముందటి భోగము గోరుచుండు నీ
పాడు శరీర భ్రాంతి వెలి ♦ బాఱఁగఁ ద్రోలుము రంగనాయకా.

ఉ॥ రాత్రులనుం బగళ్లను వి ♦ రాజిలు చంద్ర దినేంద్ర తారలుఁ
ధాత్రిని బొంచియుండి జన ♦ ధర్మము కర్మము గాంచు చుండగా
జిత్రములయ్యె మానవుల ♦ చేఁతల నెవ్వరు గానరన్న నీ
కృత్రిమ వృత్తిమాని హరిఁ ♦ గొల్చి సుఖింపుము రంగనాయకా.

ఉ॥ తీరిక నుండు వేళలను ♦ దీరని మాటలఁ బ్రొద్దు పుచ్చుచుఁ
బాఱుచు వీథులందెపుడు ♦ బాయక యేగకు దూరుఁడౌదు వీ
దూరపు జూపు జోచుచును ♦ దృష్టులు దైవము మీఁదఁజేర్చి నీ
ఘోరపుఁ గర్మ జాలములు ♦ గొట్టుము వేగమె రంగనాయకా.

ఉ॥ ఆకసమందు మేఘచయ ♦ మంతటఁ గ్రమ్మఁగ భాను తేజ మా
చీఁకటిఁ బొందునట్లు మును ♦ జేసిన కర్మము చేరివచ్చి నీ
ప్రాకట దివ్య మానసము ♦ బ్రద్దలు చేయుచుఁ పాపబుద్ధులఁ
శోకము గల్గఁజేయు నిఁక ♦ శుభ్రత నొందుము రంగనాయకా.

ఉ॥ రోగము వెంటఁ బాయకయు ♦ రోఁతలఁ జేఁతల గల్మషంబులుఁ
ఈగల వెంటనుప్పయగు ♦ నీ తనువెప్పుడు నిల్వదంచుఁ దాఁ
ద్యాగముఁ జేసి రోసి రోగి ♦ దొల్లిటి పెద్దలు నెందఱెందరో
యోగతిఁ బూని దేవునిపు ♦ డాదట నమ్ముము రంగనాయకా.

ఉ॥ నీకిడు నాఁకుపంతయును ♦ నిల్కడఁ గానక మోహ భ్రాంతిచేఁ
బోకలు పోవుచుండి యిలఁ ♦ బ్రొద్దులు పుచ్చుచు నున్నవాఁడవే
ప్రాకట వహ్ని కీలలను ♦ బాధలఁ బెట్టెడి కాలు ప్రోల నీ
వేకరణి న్వచింపఁగల ♦ వెవ్వరు బ్రోతురు రంగనాయకా.

ఉ॥ కోటికి నెక్కుడైన ధన ♦ కోటులఁ గూర్చియు విఱ్ఱవీగుచున్
మేటి సురాజ్యముల్ గలిగి ♦ మేదిని దక్కువలేక యుండినన్
గాటికిఁ బోక దీఱదిఁకఁ ♦ గార్యము మించకముందె నీవు త
న్నాటక సూత్రధారు మది ♦ నర్మిలి వేఁడుము రంగనాయకా.

ఉ॥ కోరక యేపదార్థములు ♦ గొబ్బున వచ్చును గాని వానికై
కోరి తపించినన్ భువిని ♦ గొంకులు దీఱ వదెన్నఁడేనియున్
బూరిత సంచితంబులవి ♦ పొల్పుగ వచ్చుచుఁ బోవుచుండు నీ
కోరిక రిత్తగాన హరి ♦ గొల్వుము వేగమె రంగనాయకా.

ఉ॥ ఓపికనొంది మానసము ♦ నొచ్చము లేకయె నాశమాని నీ
వేపనికైన బొంకకయె ♦ యెవ్వరి దూరక లేశమాత్రమున్
బాపము నొందఁ గల్గు పని ♦ పాటల మానియు నప్పుడప్పుడున్
ఆపరమాత్ము నీమదిని ♦ నారయు చుండుము రంగనాయకా.

ఉ॥ నారద మౌనిబృందములు ♦ నవ్య సుధీరులు జోగులందఱున్
శూరులు భీరులున్ మిగుల ♦ సూనృత వాదులు నెందఱెందఱో
శౌరిఁ దలంచి మోక్షమును ♦ జెంది సుఖించిరి యున్నతంబుగన్
ధారుణి వారిరీతిగను ♦ దైవము వేఁడుము రంగనాయకా.

ఉ॥ ఈధర జీవరాసులకు ♦ నెక్కువ మానవజన్మ మెత్తుటల్
మోదములందఁజేయుపెను ♦ మోహములందులమాయతోడనా
శ్రీధరుఁ గానకుండుటను ♦ సింహము క్షుత్తున మూషకంబుకై
బాధల బొందునట్లెయిల ♦ భాగ్యము గోరుట రంగనాయకా.

ఉ॥ ఈమహి నెందతెంద అతి ♦ హృద్యపు భక్తిని దేవుఁగొల్చి తాఁ
గామము వీడఁజేసియును ♦ గార్యఫలంబును బొందుచుండిరో
నీమది నెంచి చూడఁమిక ♦ నిర్మల బుద్ధిని దుష్టమానవా
యేమటి యుండఁబోకు-హరి ♦ నెన్నడు వీడకు రంగనాయకా.

ఉ॥ ఆఁకలిగొన్న వారికిల ♦ నారసి యన్నముఁ బెట్టినట్లుగఁ
లోకమునందు బీదజను ♦ లోలత ద్రవ్యము చేరినట్లుగఁ
గాకను నెందు పైరులకు ♦ గౌతుక మొప్ప సువృష్టి యబ్బిన
ట్లీకలి సృష్టి నున్నమన ♦ కీశుఁడు చిక్కుట రంగనాయకా.

ఉ॥ ఘాతుక పాతకుండవయి ♦ కర్మము లెన్నియొ మున్ను చేశి యీ
భూతలమందుఁ బుట్టియును ♦ బూజ్యత నొందని నాపదాళిబల్
వేతనఁ బెట్టఁబోయినను ♦ వెన్నుని భక్తిని బోవుచుండె నీ
చేఁతలనన్నిటఁ హరిని ♦ జేర్పుము నీమది రంగనాయకా.

ఉ॥ సంతలఁ గూటమందు జన ♦ సంఘము లంతటఁ బోఁజూచి దా
నింతట నంతటఁ నిలచి ♦ యింపగు మాటల నెల్లవారితో
జెంతల నిల్చి క్షేమముల ♦ జెప్పచు నుండియుఁ దిర్గివాఁడు నా
సంతను వీడునట్లె యిల ♦ సర్వము మిథ్యయె రంగనాయకా.

ఉ॥ సంపదలందుఁ దాల్మియును ♦ సాధులయందు సుశాంతిభావముల్
దెంపును నాజియందుఁదగ ♦ దేహము నందను నమ్రకంబునుల్
సొంపగువాక్కులున్ నుడువు ♦ శ్రోత్రమునందున రామసత్కథల్
ఇంపుజనింప నాహరిని ♦ నెంతయు గొల్వుము రంగనాయకా.

ఉ॥ దానము చేయలేని నరు ♦ ద్రవ్య మదంతయు మేఁక గొంతులోఁ
గానఁగ నూఁగు చండ్లవలెఁ ♦ గారణ రూపగు భారమైనదున్
బూనియు సంచరింతు రిట ♦ భూమిని నెందఱో వారిపోలకే
మానవ ధర్మమార్గమును ♦ మానక పొందుము రంగనాయకా.

ఉ॥ రేయిఁ బవళ్లనుం గడచి ♦ రేపులు మాపులు బక్ష మాసముల్
పోయెను వత్సరంబులిఁకఁ ♦ బొల్పుగ నెంచిన నెన్నియేనో యీ
కాయములోని యాయువిక ♦ గానల వెన్నెల గాయునట్లుగాఁ
బోయెను నింకనైన హరి ♦ బుద్ధిఁ దలంపుము రంగనాయకా.

ఉ॥ భోగము భాగ్యజాలములు ♦ పొల్పగు ప్రాయము బాడిపంటలున్
బాగగు పచ్చి కూరలును ♦ ప్రాప్తి లభించెడి బంధుజాలముల్
సాగర తోయ ముబ్బుటలు ♦ చాలగఁ జెట్లు ఫలంబు లిచ్చుటల్
ఆగతి నుండవెల్లపుడు ♦ నంచు దలంపుము రంగనాయకా.

ఉ॥ కొంచెము ప్రాణముల్ తనదు ♦ గొంతున నుండగ ద్రవ్యకాంక్షతో
నంచును జేరి సారెకును ♦ నంతము లేని విశేష సేవగా
వించు కళత్రముల్ సుతులు ♦ వేగమె ప్రాణము పోయినప్పు డా
మంచముఁ జేరరారుగద ♦ మార్గమికేదియొ రంగనాయకా.

ఉ॥ ఏకమునైనఁ గాంచెన మ ♦ నేకపు భూషలు నైనరీతి దా
నేకమునైనఁ బ్రత్తిని న ♦ నేకవిధాంబరముల నించు న
స్తోకమునైన మట్టిని న ♦ నేక సుపాత్రలఁ జేయునట్లుగా
నేకమయుండె యీజగము ♦ లెల్లను నిండును రంగనాయకా.

ఉ॥ భూమిని నెల్లజీవులను ♦ బొమ్మలఁ జేయుచుఁ గ్రీడఁ జేయుచున్
దామరణంబు గొన్నిటికి ♦ దప్పక యిచ్చుచు జీవమిచ్చు నా
స్వామి విచిత్ర చిత్రముల ♦ సంగతి గానరె యేమహాత్ములున్
ఆ మునిపుంగవాదులును ♦ నారయ శక్యమె రంగనాయకా.

ఉ॥ అన్నము లారగించుచును ♦ నాజలపాన మొనర్చుచున్న నీ
కన్నకుమారు భార్యలను ♦ గాపురమెప్పుడుఁ జేయుచుండినన్
దిన్నగ వారు నిన్నుగని ♦ తీపులు గూర్చెడి మాటలాడగా
నెన్నడుమానసంబు హరి ♦ నెంతయుఁగూర్పును రంగనాయకా.

ఉ॥ కోటికి ద్రవ్యమబ్బినను ♦ గూటికిఁబుట్టని లేమియబ్బినన్
బాటిల దేహకాంతులిఁక ♦ బాగుగనుండిన రోగమూడినన్
మేటిముదంబునం బొదవి ♦ మెండగు చింతల వెన్నివచ్చినన్
సూటిగ దేవు నెప్పుడును ♦ జూచుచు నుండుము రంగనాయకా.

ఉ॥ పౌరుషమాడబోకు పర ♦ భామలఁగోరకు దుష్టవృత్తులన్
జేరకు యీ చెకావళిని ♦ జెచ్చెఱఁదిట్టకు పక్షపాతముల్
గూరిచిచెప్పుచున్ మిగులఁ ♦ గుందకు మెప్పుడుహాయిఁజెంది యీ
సారసపత్రనేత్రు హరి ♦ సన్నుతిఁ జేయుము రంగనాయకా.

ఉ॥ మేలని కాలుపెట్టితివి ♦ మెప్పులు చూచియు గాపురంబునన్
జాలరివేయు నెఱ్ఱిదినఁ ♦ జక్కఁగ మత్స్యములేగఁ జావవే
చే లునికైన నియ్యులను ♦ జోలగ భ్రాంతులఁ దొల్గఁజేసి యా
మూలవిరాట్టు నీమదిని ♦ ముఖ్యముగా గను రంగనాయకా.

ఉ॥ దేహమునందు ముఖ్యమయి ♦ తేజ మొసంగెడి శీర్షమెట్టులో
శ్రీహరి యట్టులే కడమ ♦ చిల్లర దేవత లందులోపలన్
ద్రోహములేదు వానికని ♦ తొల్లిటిమానులు కోరివేఁడిరా
సాహసబుద్ధితో హరిని ♦ సన్నుతిఁ జేయుము రంగనాయకా.

ఉ॥ ఏటిముఖంబునందుఁ గన ♦ నేమలినంబు జనింప కంబువుల్
సూటిగఁబాన యోగ్యమయి ♦ సొంపుగఁబాఱుచుఁబోయిపోయిము
న్నీటిని జేరునప్పటికి ♦ నీచ జలంబగు నట్లునీకు నా
నాఁటికిఁ బ్రాయమెక్కఁజన ♦ నంబగు నంధత రంగనాయకా.

ఉ॥ ఆటలయందుఁ బ్రేమగొను ♦ నర్భకుఁడై భువినుండు కాలమున్
బోటులమీఁదఁ గాంక్షితము ♦ పొంగెడి యౌవనమందునంత నా
రాటపుఁ గర్జముల్ జరను ♦ రాజిలు నెమ్మది నెంచిచూడఁగా
మూఁటి యవస్థలం దెలిసి ♦ ముందుగ మేల్కొను రంగనాయకా

ఉ॥ ఈఁదఁగరాని కాపురము ♦ నెవ్విధినైనను ద్రోసివైచుచున్
మాధవు పాదపద్మముల ♦ మక్కువఁ గొల్చెడి భక్తులందునన్
ఈధరఁ బొందవాపదల ♦ వించుకయోజనచేసి చూడఁగన్
శ్రీధరు బాయకే కొలువఁ ♦ జిత్తమురంజిలు రంగనాయకా.

ఉ॥ దేవుని నమ్మలేని పెను ♦ దేబెల గొందఱు బాగుసేయఁగా
భావముబొంది పెద్దలొగి ♦ బంగరు వెండిని గాంసలోహముల్
దేవునిరూపుఁ జేసియిల ♦ దేవళమందుల నిల్పుచుండి రా
త్రోవల నమ్మకే హరిని ♦ దూర్ణమవేఁడుము రంగనాయకా.

ఉ॥ కూపముఁ బోలుకుక్షికిని ♦ కూటికి గుడ్డక తృప్తిపొంది బల్
తాపముచేతఁ బాపములఁ ♦ దప్పక చేయుచు నాలుబిడ్డలన్
జేపడి కాలమంతయును ♦ జెచ్చెరవీడెడు మూఢచిత్తులన్
ఆపరమాత్మ భక్తిమది ♦ నంటఁగశక్యమె రంగనాయకా.

ఉ॥ శత్రువినాశనంబు నిలఁ ♦ జయ్యనఁ జేయఁడె మాధవుండిఁ కీ
కృత్రిమమెట్లు సైచునని ♦ క్రూరతగుందకు వెఱ్ఱికై వడిన్
ధాత్రిని దాసమిత్రుఁడను ♦ తత్పరబుద్ధిని నంబరీషునిన్
శత్రువుఁ దాపసున్ దఱుము ♦ సంగతి గానవె రంగనాయకా.

ఉ॥ ఏలతపించెదీవు మును ♦ యెంతటి పాపము చేసియుండినన్
నీలసమాన ధీరుఁడగు ♦ నిర్మలతేజుని వేఁడుకొన్న నీ
పాలిటి కర్మజాలములు ♦ బ్రద్దలునొందు సుమార్గ మబ్బునా
కాలుని బాధలన్ వెఱపు ♦ గాంచేఁగ నేఁటికి రంగనాయకా.

ఉ॥ క్షీరముఁజేరి నీరములు ♦ క్షీరసమానము నొందు నట్లుగన్
నేరుపులేని యీకవిత ♦ నిచ్చలు శ్రీహరిభక్తిఁ గాంచి బల్
గారవమొప్పుచున్ భువిని ♦ గాంచును గీర్తియదెంతయేనియున్
ధీరత నొందె మానసము ♦ దీఱె మనోవ్యథ రంగనాయకా.

ఉ॥ చేసితిఁ గొన్ని పద్యములఁ జెచ్చెర నీశతకంబు నేర్పుమై
వాసిగ దీనఁ గీర్తియును వర్ధిలుచుండును సూర్య చంద్రులున్
భాసిలు నంతకాలమిల భారత భూమిని దైవభక్తిమై
వాసిగఁ బేరుఁగాంచి జన వందితమొందును రంగనాయకా.

ఉ॥ బాగుగ బల్జవంశమునఁ బాయక జన్మము వేగదాల్చియా
నాగశయాన మూర్తికిని నర్మిలి భక్తుఁడె యప్పయార్యుఁడా
నాగర పుత్రికిం సమత జొలెడు బాలమ గర్భమందునన్
రాగము మీఱఁ బుట్టె కవి రంగయనాముఁడు రంగనాయకా.

ఉ॥ ఈశతకంబునన్ జదివి కేనియు విన్నను శీలవంతులై
చేసినపాపముల్ తొలఁగి చెందుయశంబును హెచ్చునాయువున్
ఆశలఁ ద్రెంచివైచి తగ నాహరిభక్తులు నౌదు రెంతయున్
ఈశుఁడొసంగు నిజ్జగతి నిష్టఫలంబులు రంగనాయకా.

ఉ మంగళ మబ్జనాభునకు మానిత దివ్య గుణాభినేతకున్
మంగళమారమా పతికి మానవ పోషణ కర్తకెప్పుడున్
మంగళమూర్తి యార్యనుత మారుని తండ్రికిఁ గృష్ణమూర్తికిన్
మంగళమాదిదేవునకు మానుల మేటికి రంగనాయకా.

రంగనాయక శతకము

సంపూర్ణము.



శ్రీ కన్యకా పరమేశ్వరీ ముద్రాక్షరశాల, ప్రొద్దుటూరు.

# పోషకులు.



మ॥ రా॥ రా॥ శ్రీ తిరుపతి శ్రీవేంకటేశ్వరులు.

# సహాయులు.



మ॥ రా॥ రా॥ శ్రీ చింతకుంట అశ్వర్థరెడ్డి గ్రా॥ మే॥ బసిరెడ్డిపల్లె.

,, చింతకుంట మస్తాన్‌రెడ్డి.

,, డి. పెద్దనాగిరెడ్డి, సిద్దంరెడ్డిపల్లె.

,, వడ్డిమునెయ్య, యూనియన్ గుమాస్తా పులివెందుల.

,, జి. రామిరెడ్డి, సింహాద్రిపురం పోష్టుమాష్టరు.

,, పగడాల రంగయ్య, సింహాద్రిపురం.

,, జొన్నగారి చౌడప్ప ,,

,, చింతా సుబ్బయ్య ,,

,, వి. మల్లప్ప హెడ్‌మాష్టర్, పులివెందుల.

,, ఎరికెలరెడ్డిగారి పెద్దచెన్నారెడ్డి, వెన్నపూసపల్లె.

,, కొలమ్మగారి పెద్దపక్కీరు రెడ్డి ,,

,, బుస్సన్నగారి చెన్నారెడ్డి ,,

అన్నం పెద్దసుబ్బయ్య, బసిరెడ్డిపల్లె.

,, పగడాల వెంకటయ్య ,,

,, పగడాల బాలయ్య ,,

